## ప్రకటన

ప్రస్తుతం ప్రతి సోమవారము వెలువడుచున్న వారపత్రిక ఈ వారమునుంచి ప్రారంభం మాసానికి ప్రతి ఆదివారమూ వెలువడుతుంది.

మేనేజరు

## గంటలపంచాంగం

పార్థివ సం॥ వైశాఖ శు॥ అష్టమి 1945 సం॥ మే 19 శనివారం

[illegible] రా 7-49 [illegible] రా 12-9 వర్జ్యం [illegible] 11-23 ను 1-5 వ.

శు॥ నవమి మే 20 ఆదివారం

[illegible] 8-56 [illegible] రా 1-59 వర్జ్యం [illegible] 8-12 ను 10-25 వ.

ఆంధ్రపత్రిక

పార్థివ సం॥ వైశాఖ శు॥ అష్టమి శనివారము

## బర్మా భవిష్యత్తు

పరతంత్ర ప్రజలవిషయంలో బ్రిటిషు ప్రభుత్వ విధానం శాన్‌ఫ్రాన్‌సిస్కో చర్చల ద్వారా బయట పడుతూనేవుంది. పెద్ద రాజ్యాలలో రష్యా వొక్కటి తప్ప పరాధీన ప్రజలకు స్వాతంత్ర్య, స్వయంనిర్ణయ హక్కులను అంగీకరించే ప్రభుత్వం మరొకటిలేదు. 'మాకున్న దానిని మేము వదులుకోము' అను చర్చిలు వైఖరిని బ్రిటిషు ప్రతినిధులు అక్షరాలా అనుసరిస్తున్నారు. ఈ విషయమై ఏ మాత్రమైనా సందేహాలున్నట్టయితే బర్మా భావిరాజ్యాంగ వ్యవస్థనుగురించి బ్రిటిషు ప్రభుత్వంవారు నిన్న వెలువరచిన ప్రకటన అట్టి సందేహాలన్నిటినీ నివర్తించ గలుగుతుంది.

బ్రిటిషు ప్రభుత్వ ప్రకటన ప్రకారం 1948 సంవత్సరాంతం వరకు బర్మాయావత్తూ బర్మా చట్టము 139 వ శక్షన్ క్రింద పరిపాలించబడుతుంది. అనగా 93 వ శక్షను క్రింద ఇండియాలో నేడు మనం అనుభవించే గవర్నరుల నిరంకుశ ప్రభుత్వమే బర్మాలో మూడుసంవత్సరముల వరకు అమలులో వుంటుంది. ఈ మూడేండ్లలోపల తమ దేశ పరిపాలనలో బర్మీయులకే విధమైన అధికారమూ వుండదు. మూడేండ్లు దాటిన తరువాత ఎన్నికలు జరిపి 1935 చట్టం ప్రకారం మామూలు ప్రభుత్వాన్ని నెలకొల్పుతారు. ఇది రెండవ అధ్యాయం. ఈ రెండో అధ్యాయంలో బర్మా ప్రజల స్వపరిపాలనా శిక్షణ ప్రారంభ మవుతుంది. బర్మానుగురించి తమ చరమలక్ష్యాన్ని బ్రిటిషు ప్రభుత్వంవారు క్రింది విధంగా ప్రకటిస్తున్నారు. "బర్మా ప్రజలలోని వేర్వేరు పార్టీలవున్నూ, తెగలవున్నూ సమ్మతమైన ఒడంబడికను కుదుర్చుకొనిన పిమ్మట, బర్మా ప్రతినిధులు తమ దేశానికి అనుకూలమైన రాజ్యాంగ విధానాన్ని నిర్మించుకొనవలెను." అంతట బ్రిటిషు ప్రభుత్వంవారు తమ హక్కులను గురించి, పూర్వోత్తర బాధ్యతలనుగురించి బర్మా ప్రతినిధులతో సంప్రదించుతారు. ఈ ఏర్పాటు లన్నీ నెరవేరిన పిమ్మట బ్రిటిషు సామ్రాజ్యంలో బర్మా సంపూర్ణ అధినివేశ ప్రతిపత్తిని అనుభవిస్తుంది. బర్మా ఆక్రమణానంతరం బ్రిటిషు వారు బర్మాను ప్రసాదించిన రాజ్యాంగవిధాన మిస్. యుద్ధానంతర ప్రపంచ పునర్నిర్మాణమనీ, నలసరాజ్య ప్రజాక్షేమమనీ, నాజీ, ఫాసిజముల నిర్మూలనమనీ, చతుర్విధ స్వాతంత్ర్య పాలనమనీ, ప్రజారాజ్య సంస్థాపనమనీ బ్రిటిష్ వారింతవరకు ఏకరువు పెట్టుతూ వచ్చిన సిద్ధాంతాలెంత బూటకమైనవో ఇందువల్ల ప్రస్ఫుటం కాగలవు. జపాను బర్మాపై దండెత్తి రాకపూర్వమే అప్పటి బర్మా ప్రధాని యూసా బ్రిటనుకు స్వయంగా వెళ్ళి తమకు అధినివేశ స్వాతంత్ర్య మివ్వవలసిందిగా బ్రిటిషువారి నర్థించినాడు. బ్రిటిష్ ప్రభుత్వం బర్మాను వదులుకోటానికైనా సిద్ధపడిందేగాని, బర్మాకు స్వపరిపాలనాధికారాన్ని ఇవ్వటానికి సమ్మతించలేదు. 1941 లో జపాను బర్మాను ఆక్రమించింది. అది మొన్నటివరకు నామమాత్ర స్వాతంత్ర్య మనుభవించినా, బర్మా జపాను అధీనంలోనే వుండటం సంభవించింది.

బర్మా స్వపరిపాలనకు వాయిదాలు నిర్ణయించటానికిగాని, మొదటి మూడు సంవత్సరాలు దేశాన్ని నిరంకుశంగా పరిపాలించటానికిగాని ఆధార మెంత మాత్రమూ లేదు. బర్మా శత్రు ఆక్రమణలో వుండటంచేత ఆర్థికంగానూ, సాంఘికంగా నూ దేశ మనేకవిధాల నష్టపడిందనీ, ఇవి బాగుపడిన పిమ్మటగాని రాజకీయసంస్థలను పునరుద్ధరించటానికి వీలుండదనీ బ్రిటిష్ ప్రభుత్వంవారు ప్రకటిస్తున్నారు. స్వపరిపాలన మేర్పడిన గాని ఆర్థిక, సాంఘికాభివృద్ధులకు అవకాశ ముండదని భారతవర్షచరిత్ర రుజువు చేస్తూనే వున్నది. ఆర్థిక పునరుద్ధరణపేరిట బ్రిటిషువారు బర్మాలో తమ వ్యాపార, పారిశ్రామిక హక్కులను పదిలపరచుకోటానికి ప్రయత్నిస్తున్నారని వేరే చెప్ప నవసరంలేదు. మూడేండ్లు దాటిన పిమ్మట నైనా బర్మావారు వెంటనే స్వపరిపాలనకు అర్హులు కారు. బర్మాలో 'అన్ని పక్షములకూ, అన్ని తెగలకూ సమ్మతమైన రాజ్యాంగ విధానాన్ని నిర్మించుకొనవలెనట. ఇదివరకొక్క ఇండియా విషయంలోనే బ్రిటిషువారీ షరతును విధించినట్టు మనకెరుక. ఇప్పుడు బర్మాకుకూడా ఈ సూత్రం వర్తింప చేయబడింది. ఇండియాలో వలె బర్మాలో — కల్పితములే గావచ్చు — వేర్వేరు పార్టీలు, తెగలూ వున్నట్లు మనం వినలేదు. ఇదివరకు లేకపోతేనేమి? ఇంతట నారుపోసి, నీరు చల్లితే ఎంతలో మొలకలెత్తవు! అప్పటికైనా, బర్మాలో బ్రిటిషువారి బాధ్యతలుపూర్తిగా తొలగిపోవటానికి అవకాశంలేదు. ఇప్పటికికాదు, ఎప్పటికి కూడా బర్మా తమ చేతులలోనుంచి తొలగిపోవటం బ్రిటిషువారికి ఇష్టంలేదు. అసలు నిజ మిది. శత్రు ఆక్రమణ వల్ల బర్మా స్వపరిపాలనను నిలుపు చేయవలసిన పనిలేదు. ఫిలిప్పీను ద్వీపాలను జపానువారాక్రమించలేదా? ఫిలిప్పీను దీవులకు అమెరికా తక్షణ-సంపూర్ణస్వాతంత్ర్యాన్ని ప్రకటించలేదా? ఫిలిప్పీను దీవులలో మాత్రం శత్రు ఆక్రమణవల్ల దేశమనేక విధాల నష్టాన్ని పొంది వుండలేదా? ఫిలిప్పీనుదీవుల విషయంలో శత్రు ఆక్రమణ స్వపరిపాలనను మరింత చేరువకు తెచ్చింది. బర్మావిషయంలో శత్రు ఆక్రమణ స్వపరిపాలనను దూరంగా జేయటానికి హేతువేమి? బర్మావిషయంలో బ్రిటిషు ప్రభుత్వం వా. ధవలం పెంచిన వైఖరి ఒక్క బర్మాకేగాక, ఇండియాకు, బ్రిటిషు అధీనంలో వుండే తక్కిన పరాధీన ప్రజల కందరకూ ఉదాహరణ గానూ, హెచ్చరికగానూ వుండగలదు.

## విజయోదయం: రాజు అభినందన

### పార్లమెంటు సభ్యుల సన్మానం: వివిధ రాజ్యకృషి ప్రశంస

లండన్, మే 17: కామన్సు సభ్యులు, లార్డ్సు సభ్యులు ఇవ్వదలచిన సన్మాన స్వీకారానికి జార్జిచక్రవర్తి పార్లమెంటు భవనానికి వచ్చాడు. సన్మానానంతరం ఆరవజార్జి ఇలా ప్రసంగించాడు: నా ప్రజలు, మన మిత్రరాజ్యాలు చేసిన మహత్తర కృషి ఫలితంగా యూరపుఖండంలో విజయం లభ్యమైంది. దూరప్రాచ్యంలో నా ప్రజలు చాలామంది ఇప్పటికీ శత్రువుతో పోరాడుతున్నారు. అందువల్ల ఆ రంగంలో నాసాయుధదళాలు ఇంకా ఎంతో కార్యభారాన్ని సాధించవలసివున్నది. బర్మా దాస్యవిముక్తి విషయంలోనూ, భారతదేశరక్షణ విషయంలోనూ ఈ సేనలు అఖండ విజయాలను సాధించినవి. జపానుపై ఇకమీదట కూడా అమోఘమైన ధైర్య సాహసాలతో పోరాటం సాగిస్తారనే నా నమ్మకం.

నా అధినివేశరాజ్యాలు, వలసరాజ్యాలు, భారతదేశము అంగబలాన్నీ, ఆయుధబలాన్నీ విరివిగా సరఫరాచేసి సహాయపడినవి. ఇంతటి విజయాన్ని సాధించిన మిత్రరాజ్యాలు ఇకమీద ప్రపంచంలో దురాక్రమణ జరగకుండా శాంతిస్థాపనలో కలిసి పనిచేయవలసినది కూడా అవసరం."

ఈరాజ సన్మానానికి న్యూ [illegible] వేవెల్ ప్రభువు, ఫీల్డ్ మార్షల్ స్మట్సు, [illegible] ప్రభువు, తదితర ప్రముఖులు హాజరైనారు.

జార్జిరాజు తన ప్రసంగంలో ఇంకా ఇలాకూడా తెలియజేశాడు:

"అధినివేశ, వలసరాజ్య ప్రతినిధులు, భారతదేశ ప్రతినిధులూ ఈ సమావేశానికి వచ్చినందుకు సంతోషిస్తున్నాను. మన సేనానుల చాకచక్యాన్నీ, మనసేనలు ధైర్యసాహసాలనూ ప్రదర్శించక పోయినట్లయితే ఈ విజయం మనకు లభ్యమై వుండేది కాదు. సముద్ర, వాయుమార్గాల శత్రుబలాలు వీర విహారం జరుపుతునప్పటికీ, రాయల్ నావికా, విమాన దళాలు వివిధ అధినివేశ రాజ్యాల, వలస, భారతదేశ సేనల సహాయంతో మన నౌకామార్గాలను కాపాడ గలిగినవి. శత్రు బలాలు ఏ సముద్రతీరాలను దుర్భేద్యమని ఎంచినవారు, వాటి పైనే ఈ మన సేనలు ముట్టడి సాగించినవి.

1940 లో, మనసేనలు విపరీత పరిస్థితులలో సాగించిన ప్రతిఘటనా, డంకర్కు నుంచి విచిత్ర తిరోగమనమూ ఎన్నటికీ మనం మరచిపోలేము.

ఆయుధ పరికర ఉత్పత్తికోసం ఫ్యాక్టరీలలో, కర్మాగారాలలో, కార్యాలయంలో నా ప్రజలు రాత్రింబగళ్లు తీవ్రకృషి చేశారు. యుద్ధం ప్రారంభమైనప్పటినుంచి విపరీతమైన పన్నుల భారాన్ని భరిస్తు వచ్చారు. తాము నిల్వచేసుకున్న డబ్బును బుద్ధిపూర్వకంగా విరాళాలుగా ఇచ్చారు. ఈదేశ స్త్రీలు సైతం ఎంతో సహాయపడ్డారు.

స్వతంత్ర రాజ్యాధిపతిగా నేనూ నా విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించాను. ఈ కార్యక్రమంలో రాణికూడా నిర్విరామంగా సహాయపడ్డది. వివిధరంగాలలో ప్రాణాలు అర్పించిన యోధులను సంస్మరిస్తున్నాను. వారి బంధుకోటికి, ఇదే మా సానుభూతి. నా సోదరుడు కెంట్ ప్రభువుకూడా యుద్ధరంగంలోనే కూలిపోయాడు. మనం సమావేశమైన ఈ వెస్ట్ మినిస్టర్ భవనంకూడా యుద్ధంలో దెబ్బతిన్నది.

మిత్రరాజ్యకూటమి కేవలం విజయ సాధనకోసం మాత్రమే ఏర్పడింది కాదు. శాంతిస్థాపనకుకూడా కలిసి మెలసి పనిచేయాలి. మీరు ఇచ్చిన సన్మానానికి కృతజ్ఞుణ్ణి."

### తిరుపతి మ్యునిసిపాలిటీ

తిరుపతి, మే 16: మదరాసు డిస్ట్రిక్టు మ్యునిసిపాలిటీ ఆక్టు 249 వ సెక్షన్ ఈరు పరిశి పంచాయితీ బోర్డుకు అన్వయించ చేస్తూ ప్రభుత్వం ఉత్తరువు జారీచేశారు. ఇందువల్ల మ్యునిసిపాలిటీ సరిహద్దులో వున్న ప్రదేశాలు కొన్ని పంచాయితీ బోర్డుకు స్వాధీనం అవును. అపాయకరమైన వృత్తులకు, కర్మాగారాలకు లైసెన్సు ఇచ్చే అధికారం పంచాయితీ బోర్డుకు వుంటుంది.

### నీటి ఎద్దడి

పెనుగొండ, మే 15: మంచి నీళ్లకు ఇక్కడ చాలా కష్టంగా వుంది. బావులలో కూడా చాలా వరకు నీరు తగ్గిపోయింది. కొన్ని బావుల్లో అసలే లేదు. ఈ ఊరికి భోగసముద్రం చెరువే ఆధారం. పెద్ద వర్షం పడకపోతే చాలా కష్టం.

## తెనాలి చేనేత సభ

తెనాలి, మే 17: తెనాలితాలూకా చేనేత పారిశ్రామికుల మహాసభ ఇవ్వాళ జరిగినది. ఉదయం నాగినేని భారతీదేవి గారు పతాకప్రతిష్ఠ చేశారు. ఆహ్వాన సంఘనాయకులుగారి అధ్యక్షతను, పెంచెని సంక్రాంతి ములుగాగు చేనేత వస్త్రప్రదర్శనం సభ ప్రారంభించారు. మహాసభను శ్రీ ప్రకాశం పంతులుగారు ప్రారంభించారు. ఆహ్వాన సంఘాధ్యక్షుని, అధ్యక్షుని ఉపన్యాసముల అనంతరం పలువురు ప్రముఖులు ఉపన్యసించారు.

### శ్రీ పోలిశెట్టి సుబ్బారావుగారి ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము

యంత్రయుగప్రారంభము నుండియు తీవ్రముగు మిల్లులపోటీతో చేనేతపరిశ్రమ నానాటికీ క్షీణించిపోవుచున్నది. దేశములోయున్న గుడ్డ కొరతను తీర్చుటకై ప్రభుత్వమువారు మిల్లుల పైననే ఆధారపడు చుండిరి. కాని యిందువలన దేశములోని ప్రజలకు అవసరమైన బట్టను మాత్రము అందించలేకపోయిరి. వర్తమాన లక్షలాది చేనేత పారిశ్రామికులు కావలసిన గుడ్డను చాలవరకు తయారుచేసి యిచ్చుటకు సిద్ధపడి యుండగా ప్రభుత్వమువారు వారికి కావలసిన నూలు, రంగులు వగైరాలు సరఫరా చేయక ప్రస్తుత పరిస్థితులలో గుడ్డకొరతను తృప్తికరముగా పరిష్కరించజాలమని తమ నిస్సహాయతను ప్రకటించుట మిగులవిస్మయకరము.

మహాత్మాగాంధీగారు చెప్పుచున్నట్లు గ్రామవాసులెల్లరు తమకు కావలసిన బట్టలకొరకున్నూ అవసరమయిన నూలుకొరకున్నూ పట్టణములలో నున్న యంత్రములపై ఆధారపడక స్వయంపోషకముగా రాట్నముపై నూలుతీసి, సొంతమున్న చేతిమగ్గములపై బట్టలు తయారు చేయించుటకు సిద్ధమైయుండిన యెడల దేశములో యిట్టి తీవ్రమగు గుడ్డకొరత యేర్పడియుండెడిది కాదు. కాని మిల్లునూలుపై ఆధారపడిన పారిశ్రామికులు గత 2 సం॥గా అనుభవించుచున్న బాధలు వివాయంపరిశీ అనుభవైకవేద్యమే. యుద్ధానంతర మేర్పడనున్న తీవ్రనిరుద్యోగ సమస్యా నిర్మూలనమునకు చేనేత పరిశ్రమ అతి ఉత్తమసాధనమని ప్రభుత్వమువారు సుగ్రహించవలసియున్నది.

### శ్రీ ప్రగడ కోటయ్యగారి అధ్యక్షోపన్యాసము

గృహపరిశ్రమ లన్నిటిలో చేనేతకును హెచ్చుమంది ప్రజలకు పనిని కల్పించుచూ, మిల్లులపోటీకి తట్టుకొని నిలచి యున్నది. చేనేత పరిశ్రమయే చేనేత పరిశ్రమ యీస్టిండియా కంపెనీవారి అక్రమచర్యలవలన క్రమముగా నీరసించసాగెను. విదేశీయ పరిపాలనతో పాటు అప్పటినుంచీ దిగుమతి కాబడుచుండిన విదేశీ వస్త్రవ్యామోహములో భారతప్రజలు పడిపోయినందున మన పరిశ్రమ మరింత క్షీణించినది. అతి సన్ననిమాలులను నేయుట భారతదేశ మహోజ్వలచరిత్రకు కారణభూతమైన మనరాట్నము అటకపై కెక్కినది. కాని చేనేత పరిశ్రమయే ప్రధానవృత్తిగ కలిగి జీవనము చేయుచున్న చేనేత పారిశ్రామికులు తమవృత్తిని విడుచుటకవకాశము లేనందున విదేశీ మిల్లునూలుపైనను, దేశీయమిల్లునూలుపైనను ఆధారపడవచ్చిరి. నిరంతరము చేనేతపరిశ్రమయొక్క వినాశనమును కోరుచున్న మిల్లు యజమానులు అత్యధికలాభములను తీసుకొని గిట్టుబాటుగాని ధరలకు చేనేత పారిశ్రామికులకు యిప్పటివరకును నూలునప్లయి చేయుచు వచ్చిరిగాని, యుద్ధప్రారంభమునుండియు ప్రభుత్వమువారిచే మిల్లుబట్టల కొనుగోలు ఎక్కువ కాబడినందున చేనేత పారిశ్రామికులకు సప్లయి చేయుచుండిన నూళ్లనుకూడా నేము బట్టలకే వినియోగించి అధికలాభములను పొందజొచ్చిరి. లేదా విపరీతలాభములతో నూలును చేనేత పారిశ్రామికుల కమ్మ జొచ్చిరి.

ప్రభుత్వమువారు యుద్ధానంతర ప్రణాళికలలో చేనేతపరిశ్రమ పునరభివృద్ధిని, ఆవశ్యకతను సుగ్రహించినటుల కన్పించదు.

మహాత్మాగాంధీగారు చెప్పుచున్నటుల ఖద్దరు చేనేత పరిశ్రమల అభివృద్ధివలన నిరుద్యోగ సమస్య పరిష్కారమగుటయేగాక, భారతదేశ దాస్యవిమోచనముకూడా జరుగగలదు.

కనుకరాదిన యింటను కష్టమాడిన యింటను కరువుండదనునట్లు గ్రామవాసులందరును రాట్నములను చేబూని పూర్వమువలె వడుక నారంభించినచో, యెన్ని యుద్ధములు వచ్చినప్పటికి దేశమున గుడ్డకొరత యేర్పడక, యిప్పుడున్న కోటిమంది చేనేత పారిశ్రామికులకే గాక మరి మూడునాల్గు కోట్లమంది పారిశ్రామికులకు ఖద్దరుపరిశ్రమ నాధారముగ పుష్కలమైన పని లభించగలదు.

మన జాతీయప్రభుత్వ మేర్పడి మహాత్ముని గృహపరిశ్రమల విధానమును పూర్తిగా అమలుజరుపునంతవరకు, మన చేనేత పరిశ్రమకు తగిన రక్షణ చేకూర్చుట ప్రభుత్వమువారి విధియైయున్నది. ప్రారంభము నుండి మనమాందోళన చేయుచున్నటుల, భారతదేశ వినియోగమునకుగాను మిల్లు బట్టల వుత్పత్తిని మితపరచి, చేనేత పరిశ్రమాభివృద్ధికి ప్రభుత్వమువారు పూనుకొనవలెను. ఇందుకు చేనేత పారిశ్రామికులు, అభిమానులు అందరూ తీవ్రమైన ఆందోళన సాగించవలెను.

పైనిచ్చిన మనకోర్కెలన్నియు సఫలము కావలెనన్నచో మహాత్ముని గ్రామపునర్నిర్మాణవిధానమే శరణ్యము గాన చేనేత పారిశ్రామికులెల్లరు ఆ విధానమును అమలులోనికి తెచ్చుటకై సంపూర్ణముగా తోడ్పడుచూ, చేనేత పరిశ్రమాభివృద్ధిని, దేశాభ్యున్నతిని కృషిచేయవలసినదని కోరుచున్నాను.

## మలాకా జల సంధిలో బ్రిటిష్ యుద్ధనావలు

### టోకియో వార్తలు

లండన్, మే 17: 1942 సంవత్సరంలో పతనమైన సింగపూరురేవుకు చాలా సమీపంగా బ్రిటిషు యుద్ధనావలు పోరాడుటకు వచ్చాయని టోకియోనుండి అందిన వార్తలు తెలుపుతున్నాయి. ఇది నిజమే అయి బ్రిటిషునావలు మలయాకు చేరుకున్నట్లైతే జపాను ఆక్రమిత ప్రాంతాలను సుమిత్రా మలయాలకు ముప్పు కలుగవచ్చునని రాయిటరు విలేఖరి వ్రాస్తున్నాడు.

మూడు డిస్ట్రాయర్లు, రెండు క్రూయిజర్లుగల బ్రిటిషు నౌకాదళములో ఒక డిస్ట్రాయరును ముంచినట్లు జపానువారు ప్రకటిస్తున్నారు. బ్రిటిషునావలు మలాకా జలసంధిలో విజయం సాధించి ఆ ప్రాంతాలను విముక్తి పరిస్తే జపాను అంతిమ ఓటమి మరింత శీఘ్రంగా జరుగవచ్చునని అడ్మిరల్ సామర్విల్ గారు తెలిపిరి.

ఓకినావాలో యుద్ధస్థితి ఆశాజనకంగా లేదని టోకియో రేడియో తెలిపింది. అక్కడి జపాను సేనలకు సగంపైగా ఎదురు ముప్పు మైనదని విలేఖరి తెలుపుతున్నాడు.

బోర్నియో కు ఆవల తారాకాన్ ద్వీపంలో జపాను బలాలు హెలెన్ నుంచి ఉపసంహరించబడెను.

## మిత్రరాజ్యాల వైఖరి

(1-వ పేజీ తరువాయి)

చుకోవాలని కామన్సులో చర్చిల్ అన్న మాటలు చాలా సందిగ్ధం గా ఉన్నాయనీ, కలవరం కలిగిస్తున్నాయనీ మిత వాదుల పత్రిక 'న్యూస్ క్రానికల్' వ్రాసింది.

అడ్మిరల్ డోనిట్జ్ పట్ల అధికారవర్గాలు చూపుతున్న దాక్షిణ్యం, చర్చిల్ మాటలలోస్ఫురిస్తున్న ఉద్దేశమూ గమనిస్తే పనుమకిడక్కు మిత్రరాజ్యాలు జర్మనీలో చేటు పెయ్య ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటానికి ప్రయత్నిస్తున్నట్లు పొడకడుతోందనీ, ఈ ప్రయత్నమే కనక జరిగేటట్లయితే బ్రిటిషు ప్రజలలోనూ, మిగతా మిత్రదేశాల ప్రజలలోనూ తిరస్కారభావం ప్రబలుతుందనీ ఆ పత్రిక వ్రాసింది.

'డెయిలీ హెరాల్డు' పత్రిక కూడా చర్చిల్ ఉపన్యాసంలోని ఆ వేభాగాన్ని పురస్కరించుకొని, ఇట్లా జరిగితే జర్మనీ ప్రస్తుత పరిస్థితివిషయమై ప్రబలిన ఆందోళనా, అలజడీ తొలగడం కల్ల అని వ్రాసింది.

బర్లిన్‌లోని మిత్రరాజ్యాల కంట్రోలు కమిషన్ ఆక్రమణ కార్యక్రమం సక్రమంగా జరుగుతుందన్నారనీ, ఆ కంట్రోలు ఏమీ పనిచేయడంలేదనీ, యూరప్ సలహాసంఘం ఒకటి సంధికి పూర్తిపథకం తయారు చేస్తుందన్నారనీ, ఆ పథకం ఏమిటో, ఎక్కడుందో తెలియదనీ, కంట్రోలు కమిషన్‌లో బ్రిటిషు ప్రతినిధి ఎవరో తెలియదనీ, ఇటువంటి ముఖ్యమైన పదవికి ఇంతవరకూ ఎవరినీ నియోగించకపోవడానికి కారణమేమో తెలియదనీ, ఈలోగా జర్మన్లలో కొందరు ఉన్మాదవంతులు జయలు దేరి తామే ప్రభుత్వం అని చెప్పుకొని పలుకుబడి సంపాయించుకొంటారనీ ఆ పత్రిక వ్రాసింది.

ఐసెన్‌హోవర్ చర్చిలును కలుసుకోకపోవడంవల్ల జర్మనీని ఏవిధంగా చూడాలన్న విషయం అడుగున పడిపోలేదని స్పష్టపడుతోందని 'యార్క్‌షైర్ పోస్టు' వ్రాసింది. హిట్లరు నాయామే సాగుతున్నదనీ, అతని అనుచరులే అధికారంలో ఉన్నారనీ జర్మనులు అనుకొనే అవకాశం ఉండడం ప్రమాదమనీ, ఆ వాతావరణంలో పాలితులైనా లేని ప్రభుత్వం ఏర్పడితేనప్పుడే బ్రిటిషు ప్రజల మనస్సులు చల్లబడతాయనీ ఆ పత్రిక వ్రాసింది.

యుద్ధనేరస్థులను శిక్షించే విషయమై బ్రిటనులో చాలా సంశయాలున్నాయనీ, వారిని ఎప్పుడు, ఎక్కడ, ఏ విధంగా విచారించాలన్న విషయమై మిత్రరాజ్యాలు ఇంకా ఒక అభిప్రాయానికి రాలేదనీ 'డెయిలీ మెయిల్' వ్రాసింది.

హిమ్లరు, గోరింగుల లాంటి ప్రధాన నేరస్థుల విషయంలో విచారణ జరుగవలసిన అవసరం లేదనీ, అందరూ కలిసి ఒక నిర్ణయానికి వస్తే చాలుననీ, ఏది జరిగినా వెంటనే జరగాలనీ 'ఆలస్యం అమృతం విషం' అనీ, ఆనరికి అసలు శిక్షించడమే జరక్క పోవచ్చుననీ ఆ పత్రిక వ్రాసింది.

## సంధిసూచనలు

(1-వ పేజీ తరువాయి)

మానే జపాన్ సామ్రాజ్యకాంక్షాన్ని పూర్తిగా నిర్మూలించి వేయాల్సివుంటుందని మైఖ్సు హెచ్చరించింది.

### చక్రవర్తి చర్య

యుద్ధకాంక్షగల సామ్రాజ్యపాలనా సంఘం అయిన జపాను ఫాసిస్టుపార్టీని రద్దుచేయుటద్వారా జపాను చక్రవర్తి సంధిబేరమును ప్రారంభించినాడని లండన్ డెయిలీ మెయిల్ పత్రిక న్యూయార్కు విలేఖరి వ్రాస్తున్నాడు: ఫాసిస్టుపార్టీని రద్దుచేయుటతో బాటు జపాను పారిశ్రామికులు వాషింగ్టన్ వర్గాలకు రహస్యంగా సంధిసూచనలను పంపినట్లు కూడా రయటరు తెలిసిందని ఈ విలేఖరి ప్రకటిస్తున్నాడు.

ఈ సంధి కోరేవారు టోకియోలో కొత్తగా ఏర్పడిన ఒక "శాంతిపక్షం" నాయకులనీ పసిఫిక్‌లో ఒక్కొక్క మిత్రవిజయంతోబాటు వీరిబలం ఎక్కువ అవుతూ ఉందనీ ఈ విలేఖరి తెలియచేస్తూ ఉన్నాడు.

ఏదోవిధంగా మిత్రరాజ్యాల నిర్బంధం లోంచుబాటు మరదును మార్చే విధాన్ని అన్వేషించవలసిందని తటస్థరాజ్యాలలోని జపాను ప్రముఖులకు వీరు సలహాలు పంపినారట.

సంధి సూచన ఇందుమించు ఈ ధోరణిలో ఉన్నట్లు తెలుస్తున్నది.

మలయా, డచ్ ఈస్టిండీసు నుంచి వెంటనే జపానుసేనల ఉపసంహరించుకొనుట, ఫ్రెంచి ఇండో - చైనా, కంబోడియాను వెంటనే ఫ్రాన్సుకు వప్పగింత పెట్టడమూ;

మిత్రరాజ్యాల కవచాలుముగా ఉండకుండా మరళాల మెండాలపై స్వచ్ఛమైన సైనికేతర ప్రభుత్వమును చక్రవర్తి హిరోహితో పెత్తనంకింద ఏర్పాటు చేయడమూ,

మంచూరియా, చైనాలలో జపాను జయించిన ప్రాంతాల విషయం."

పసిఫిక్‌లోని మాండేట్ దీవులను జపాన్ జనాభాపోషణ, పారిశ్రామిక అభివృద్ధికి భంగం కలగకుండా ఉంచు వదలిమీద సంపకం.

ఒకినావాపై అమెరికన్‌లుదిగి జయప్రదంగా యుద్ధాన్ని సాగించుకూ ఉంటంవల్ల ఈ సంధిసూచనలు బయలుదేరి వుంటవి. మిత్రరాజ్యాలు బేమరకుగా లొంగిపోవాలనే అంటున్నారు గాని చక్రవర్తి పోవాలిఅని అనలేదు గనుక ఇప్పుడు చక్రవర్తి ఈ ప్రయత్నం చేస్తున్నాడు.

త్వరలోనే జపాన్ పారిశ్రామికులు ప్రస్తుత సైనికప్రభుత్వమును తొలగించి సంధికి తమ ఆసక్తిని ప్రదర్శింపవచ్చును.

### జపాన్‌పత్రిక అనుమానం

జపాన్‌పత్రిక "యొమియూరి హోచి షింబన్" పసిఫిక్ యుద్ధంయెడల రష్యా ఏ ధోరణిని అవలంబిస్తుందో తెల్పుమంటూ ఒక సంపాదకీయం వ్రాసింది. యూరప్‌యుద్ధం ముగియుటంవల్ల రష్యా బలువు కొంత తగ్గిందిగాని, యూరప్‌లోని యుద్ధానంతర సమస్యలు రష్యాకు కొంత భారంగానే వుంటవి అనీ, ఈ సమస్యలవల్ల బ్రిటన్ అమెరికా రష్యాలకు ఘర్షణలు ఏర్పడినా ఏర్పడవచ్చుననీ, ఈ పత్రిక సూచిస్తోంది.

"ఈ యుద్ధంలో జపాన్ రష్యాలు ఉభయులున్నూ తటస్థ ఒడంబడికను గౌరవించినవి. ఆదేశాల మధ్య కొంతకాలం ఇకకొలంకంగా ఉన్నా పరస్పర విశ్వాసాల కాపాడుకొన్నవి. చాలాకాలంవరకూ సోవియట్ రష్యా ఈ విషయాన్ని జ్ఞాపకం ఉంచుకోగలదు.

### రష్యా ప్రతిసూచనలు?

లండను, మే 17: జపాను పారిశ్రామిక పెద్దలు రష్యాప్రభుత్వంద్వారా పంపిన సంధిసూచనలు ప్రస్తుత జపాను ప్రభుత్వాభిప్రాయమునుగూడ తెలుపుచుండవచ్చును. పీమన ప్రభుత్వసభ్యులు 10 మందిలో ఏడ్గురికి పెద్దవ్యాపారాలతో సంబంధం గలదు. అని జాన్ కించిగాను, రాయిటరు మిలిటరీ విలేఖరి వ్రాస్తున్నాడు.

"ఈ వార్త ప్రజలందరకు తెలియజేయబడినందున, జపాను ప్రభుత్వం తమదేశంలో మిలిటరీ, ఫాసిస్టు అతివాదుల ఒత్తిడిని ఎట్లు ఎదుర్కొనగలదో చూడవలసియుండును.

జపానువారి యీ సూచనలో యిక ముందు దురాక్రమణచేయరని హామీ యేమీ లేదని సోవియటు అధికారులు అభిప్రాయపడుచున్నట్లు శాన్‌ఫ్రాన్‌సిస్కోనుండి తెలియవచ్చినది. ఈ అభిప్రాయం లండను అభిప్రాయానికి అనుకూలంగావుండి, ఇకముందు దూరప్రాచ్యమునందు రష్యా యింకా చురుకుగా పనిచేయునని లండనులో ఎంచబడుచున్నది.

మిత్రమండలివారు విధించు లొంగుబాటు షరతులు పూర్తిగా జపాను అంగీకరించెది, ఏషియాలో దురాక్రమించిన భాగాలను వదులుకొంతే తప్ప, రష్యా మిత్రమండలితో చేరి జపాను దురాక్రమ నిర్ణయం చేసుండా చేయనిశ్చయించినట్లు, సోవియటు ప్రభుత్వం జపానుకి అంద్వేసం దేశం పంపువని యిటు విషయాలను కొంటున్నారు. ముందు ఏగు [illegible] యున్నది. రాయిటరు.

# వార్తావళి

బెజవాడ, మే 15: నిరుడు జూన్ 2 న గాని వదలని కృష్ణకాలువ కన్నెరపోటు వల్ల నీరు వచ్చినందున ఈ దినం ముందుగా వదిలెరి.

రాజమండ్రి. బ్రాంచి రైల్వే ఎంప్లాయీస్ యూనియన్ అధ్వర్యాన సామర్లకోట రైల్వే పనివారల మహాసభ ఈ 13 న కొత్తూరులో ఏ. శ్రీనివాసరావుగారి అధ్యక్షతను జరిగింది. ఏ. వి. రమణయ్యగారు సభ ప్రారంభించారు.

రాజమండ్రి దివ్యజ్ఞానసమాజంవారు వైట్ లోటస్ దినోత్సవాన్ని రావు బహద్దర్ అవసరాల రామరావుగారి అధ్యక్షతను జరిపారు. (స్వ. వి.)

తెనాలిలో తెనాలి రేంజి ఉపాధ్యాయసంఘం వ్యాయామ పోటీలు జరిగినవి. వస్తు ప్రదర్శనం, ఉపాధ్యాయసభలున్నూ జరిగినవి.

నెల్లూరులో హిందూమహాసభ ఆధ్వర్యాన అఖండ భారత స్వాతంత్ర్యోత్సవం జరిగింది. శ్రీ పైడా సుబ్బారామయ్య శ్రేష్ఠిగారు స్వాతంత్ర్య ప్రతిజ్ఞ నునురించి ఉపన్యసించారు.

(స్వ. వి.)

శ్రీ సాకేటి సురభ్రులు, శ్రీ కొట్టుముక్కల వెంకన్నగార్లు అభివృద్ధిని అడ్డగించే దురాచారాలను విడిచిపెట్టి వలసినదిగా హరిజనులను ప్రబోధిస్తూ దుస్సుంపాడు, మాసనాయపాలెం, చిలవమూలపల్లి గ్రామాల్లో ప్రచారం చేశారు. (స్వ. వి.)

నంద్యాలకోట మ్యునిసిపల్ ప్రాథమిక బాలికా పాఠశాల వార్షికోత్సవం శ్రీమతి ఎలిసెట్టి సుబ్బలక్ష్మమ్మగారి అధ్యక్షతను జరిగింది.

తెనాలిక్లాత్ మర్చంట్సు అసోసియేషన్ కార్యవర్గసమావేశం జరిగింది. ఇమ్మడి నలమయ్యగారు అధ్యక్షులుగా, పెను గొండ రంగారావుగారు కార్యదర్శిగా కార్యవర్గం ఎన్నికలు జరిగినవి.

(స్వ. వి)

నూజివీడులోని పుస్తకాలయంలో పుస్తకాలను తెప్పించటానికిగాను శ్రీరాజ్యలక్ష్మీ నాట్యమండలివారు 102 రూపాయలు ఇచ్చారు.

ఆవనిలో విద్వాన్ తంగిరాల రామమూర్తిగారి అధ్యక్షతను శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు కావ్యాన్ని గూర్చి ఉపన్యసించారు. శాస్త్రిగారు రచించే అలంకార గ్రంథం ప్రకటనకుగాను ఆవని పౌరులు 1250 రూపాయల్ని సమర్పించారు. (స్వ. వి)

నరసాపురం తాలూకా కాంగ్రెసు ఎసెంబ్లీ సమావేశం శ్రీ ఇందుకూరి సత్యనారాయణరాజుగారి అధ్యక్షతను జరిగింది. ఇందుకూరి సత్యనారాయణరాజుగారు అధ్యక్షులుగాను, పెన్మెచ్చ సూర్యనారాయణరాజుగారు కార్యదర్శిగాను ఎన్నికొన్నారు. (స్వ. వి.)

శృంగారపురం జ్ఞానదాయిని పుస్తక భాండాగార రజతోత్సవం ఈ 4, 5, 6 లలో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు పంతులుగారి అధ్యక్షతను జరిగింది. నూతన భవన ప్రవేశం, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు చేశారు. అన్న ప్రదానం జరిగింది.

పెదన చేనేత బట్టలు నూలు వర్తక సుమాస్తా సంఘంవారి రెండవ వార్షికోత్సవం శ్రీ జాగాబత్తుల చినసుబ్బయ్యగారి అధ్యక్షతను జరిగింది.

బెజవాడ ప్రకృతి ధర్మపరిషత్తు ఏటేటా నడుపుతూన్న ప్రకృతి శిబిరం ఈసాలు కర్నూలుజిల్లా బనగానిపల్లె స్వస్తి ఆశ్రమంలో శ్రీ భిక్షుస్వామిగారు ప్రారంభంచేశారు. ప్రకృతిశర్మ, హంసానంద సరస్వతీస్వామి చలసాని కృష్ణారావు గార్లు ఉపన్యాసాలు చేస్తున్నారు.

ఆత్మకూరు గ్రామంలో ఆలూరు నాగభూషణరావుగారి అధ్యక్షతను నెహ్రూగ్రంథాలయం స్థాపించబడింది.

నరసారావుపేట పవిత్రంలో నిజాన్నలగడ్డలో పశుప్రదర్శనం జరిగింది. అధ్యక్షులయిన నల్లపాటి వెంకట్రామయ్య చౌదరిగారు శ్రేష్ఠమైన పశువులకు బహుమతులను ఇచ్చారు. (స్వ. వి.)

గరజాల హరిజన విద్యార్థి వసతి గృహములో ఈ సం॥ 50 మంది విద్యార్థులను చేర్చుకొంటురనీ విద్యార్థులకు, భోజనం, పుస్తకాలు ఉచితంగా ఇస్తారనీ, వసతి గృహంలో చేరే విద్యార్థులు జూన్ 1 లోగా దరఖాస్తులు పంపాలని ప్రాయూలనీ వసతిగృహం మేనేజరు ప్రాస్తున్నారు.

ఏలూరు శుద్ధి సంఘం వారి యాజమాన్యాన మెరుసుమల్లి రెడ్డయ్య, వెరుపల్లె నంబెరుమాళ్లు గార్లు, మామూరు, యల్లాపురం, రుద్రపాక, బొమ్మలూరు గ్రామాలలో 5 కుటుంబాలకు చెందిన 34 మందిక్రైస్తవుల్ని హిందూమతంలోకి చేర్చారు. (స్వ. వి.)

రాజమండ్రి ఎవాంజిలికన్ ఏసోసియేషను ప్రథమ వార్షికోత్సవం కె. రామశాస్త్రిగారి అధ్యక్షతను జరిగింది.

(స్వ. వి.)

బెజవాడ కొత్తపేటలో 'గాంధీ విజ్ఞానిక సమితి పుస్తక భాండాగారాన్ని మహర్షి చిట్టిగారు ప్రారంభం చేశారు.

(స్వ. వి.)

సాయన్నగారిపల్లె హాస్తవ్యులు కూరపాటి రంగయ్యనాయుడు, మాలేపాటి రామకృష్ణయ్యనాయుడుగార్లు 2 వేల మంది నిరుపేద హరిజనులకు అన్న ప్రదానం చేశారు.

అవటపల్లి నారాయణరావుగారు పక్షవాతంవల్ల బాధపడుతున్నారు. వారి దేహస్థితి ఆందోళన కలుగజేస్తున్నదని వైద్యులు అంటున్నారు.

నుతివాడ తాలూకా పెద్దమద్దాలికాపు రస్తురాలు కంకపల్లి సంతోషం అనే క్రైస్తవయువతి, తన ముగ్గురు కుమారులతో సహా హిందూమతములో కలిసింది.

తెనాలి ఆయుర్వేదవైద్యసమ్మేళనం సందర్భంలో ఓషధీ, ఔషధప్రదర్శనాలు జరిగినవి. ఏ జెల్లశ్రీరాములుగారు ప్రారంభించారు.

శ్రీ అద్దాల వెంకటస్వామిగారి అధ్యక్షతను రాజమండ్రి పట్టువర్తకుల సుమాస్తాల సంఘసభ జరిగింది. సంఘాన్ని అభివృద్ధిలోకి తీసుకురావడానికి ఒక కమిటీని సభవారు నియమించారు.

చిలకలూరి పేటలోని శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి గ్రంథాలయానికి భవననిర్మాణానికి అయ్యేఖర్చును ఇవ్వడానికి స్థానిక వర్తక ప్రముఖులు రాచమల్లు కన్నయ్య బ్రదర్సువారు వాగ్దానంచేశారు.

చేబ్రోలులో విశ్వబ్రాహ్మణసంఘ యాజమాన్యాన ఈ 13 న దర్శి సుబ్బారావుగారి అధ్యక్షతన శ్రీ రుద్రకవి జయంతి జరిగింది. పలువురు సాహిత్య వేత్తలు పాల్గొన్నారు.

శ్రీకాకుళం దగ్గర అయ్యాలీ నగరంలో శ్రీ దంతులూరు సత్యనారాయణరాజు గారూ మరి 40 హరిజనులూచేసిన కృషివల్ల అమ్మవారి ఉత్సవాల్లో ఎద్దుబోతుబలి ఆగింది. (స్వ. వి.)

బెజవాడ స్వకృషి విద్యార్థిసంఘం వార్షికోత్సవం జరిగింది. జగద్గురు బోధానంద మహర్షి ఉపన్యసించారు.

చీరాల చేనేతవస్త్రుల వర్తక సంఘం వారు చుండూరు వి ఓబయ్యశ్రేష్ఠిగారి అధ్యక్షతను ఈ 8 వ సమావేశమైనారు. అద్దకపు పరిశ్రమస్థితిగతులను విచారించి కమిషనరుకు విజ్ఞాపన పంపినారు.(స్వ.వి)

మైసూరునందలి తుంకూరులో అఖిల భారత వీరశైవ 15-వ మహాసభ జరిగింది. శ్రీ పంతెద్దు సత్యనారాయణమూర్తిగారు ఉత్తరసర్కారుల్లో వెనకబడిన వీరశైవుల్ని గురించి ఉపన్యసించారు. రాబోయే మహాసభను, శ్రీశైలం దగ్గిర మహానందికి ఆహ్వానించారు.

## మదరాసు రేడియో

మే 20 ఆదివారం

(వి. యు. యం. 211 మీ.) ఉ॥ 9-30; మ॥ 2-10 డి. కే. జయరామన్. మ॥ 1-0; రా॥ 8-0 చెన్నమ్మ. మ॥ 2-30 ఏ. ఐ. ఆర్. వాద్యసంగీతం. మ॥ 3-0 టి. పుట్టుస్వామయ్య సా॥ 4-30 పిల్లలకుగాను తెలుగులో ప్రసారం. సా॥ 5-30; రా॥ 8-45 మదరాసు బాలకృష్ణ అయ్యరు (ఫిడేలు) సా॥ 7-25 శ్రోతల పరిచయం. రా॥ 10-0 రికార్డులు.

మదరాసు 2. ఉ॥ 7-40; మ॥ 2-5; సా॥ 7-30 తెలుగులో వార్తలు

* * *

## తిరుచినాపల్లి రేడియో

సా॥ 5-0; రా॥ 8-45 టి. కే.రామస్వామి సా॥ 6-0; రా॥ 8-0 ఆర్. పద్మనాభయ్యర్ (మురళి) రా॥ 10-0 రికార్డులు.

## మదరాసు ధరలు

మదరాసు, మే 18:

వేరుసెనగ; (531 పౌ॥ దా॥ 1-కి ఎక్సు కోస్తా గిడ్డంగులు) క్రొత్తరకం మెషిన్‌పప్పు డిటో ఆపీసువెం 57-8-0 60-0-0 వేరుసెనగనూనె (ఇంగ్లీషు కాండి 500 పౌను గలది) 1-కి ఏక్స్ రకం 140-0-0 ఎక్సుపెల్లర్ (సేల్సుటాక్సుతో సహా) ధ. 145-0-0 వెంకాయనూనె 38 పౌనుగల డబ్బా 1-కి ప్రాతుకేడు కొబ్బరి కాయలు (సిలోనురకం) 1100-కి 130-0-0 150-0-0: రెండోరకం దొరదాచేర 95-0-0. 105-0-0: ఆముదము (మిల్ డెలివరి) ఎక్సుపెల్లరు పర్ ఇంగ్లీషు కాండి 500 పౌనులుగలది 190-0-0. చక్కెర: జావ్వారు 52-6-0 53-1-0.

బంగారు: వెండి: నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి (చిల్లరధర) 51-4-0 పెట్టా బంగారు తులం 76-10-0. సీమవెండి తులపు 100-కి (కడ్డీ) 132-0-0 తులం వెండి 1-కి 1-5-6.







# ది కృష్ణా జూట్ మిల్సు లిమిటెడ్,

## యేలూరు.

### హెచ్చరిక

14-5-1945 తేదీని ఆంధ్రపత్రికలో శ్రీ మైలవరపు రామకృష్ణారావుగారి సంతకముతో చేయబడిన ప్రకటనయొక్క సంగతులు ఎంతమాత్రము నిజమైనవిన్నీ చెల్లదగినవిన్నీ కావు. 16-4-1945 తేదీని జరిగినట్లు చెప్పబడే సర్వసభ్య అసాధారణ, సాధారణ సమావేశములు సక్రమముగా కన్వీన్ చేయబడినట్టిన్నీ, జరుపబడినట్టిన్నీ సమావేశములు కావు. అట్టి సమావేశములయొక్క తీర్మానములు కంపెనీని ఎంతమాత్రమున్నూ బైండుచేయనేరవు. అట్టి సమావేశములందు డైరెక్టర్లుగా ఎన్నుకొనబడినట్లు చెప్పబడే (1) శ్రీ మానేపల్లి సూర్యనారాయణ, (2) శ్రీ పోలిసెట్టి గోవిందరావు, (3) శ్రీ నంగులూరి రత్నం, (4) శ్రీ మద్దుల అప్పారావు, (5) శ్రీ వంకినేని చిన వెంకటసుబ్బయ్య, (6) శ్రీ మైలవరపు రామకృష్ణారావు, (7) శ్రీ కొత్తమాసు వెంకటకృష్ణారావు, (8) శ్రీ కంభంపాటి కన్నయ్యగార్లు గాని, ఆనరరీ ట్రెజరర్ అండ్ సెక్రటరీగా ఎన్నుకొనబడినట్లు చెప్పబడే శ్రీ కొత్తమాసు వెంకటకృష్ణారావుగారు గాని, సెక్రటరీ అండ్ ట్రెజరరుగా ఎన్నుకొనబడినట్లు చెప్పబడే శ్రీ మైలవరపు రామకృష్ణారావుగారు గాని, దరిమిలా 21-4-1945 తేదీని జరిగినట్లు చెప్పబడే బోర్డు ఆఫ్ డైరెక్టర్ల మీటింగులో డైరెక్టర్లబోర్డుకు ఛెయిర్మన్‌గా ఎన్నుకొనబడినట్లుగా చెప్పబడే శ్రీ కంభంపాటి కన్నయ్యగారు గాని, కంపెనీలో ఆయా పదవులను స్వీకరించుటకున్నూ, చలాయించుటకున్నూ ఎట్టి అవకాశము, అధికారము లేదు.

కంపెనీకి ప్రస్తుతం అమలులో యున్నట్టిన్నీ సక్రమమైనట్టిన్నీ డైరెక్టర్లు:

1. శ్రీ గ్రంధి ఆంజనేయులు
2. శ్రీ తమ్మన శ్రీరాములు
3. శ్రీ వంకినేని రాజగోపాల వెంకటరత్నం
4. శ్రీ పసుమర్తి సత్యనారాయణరావు
5. శ్రీ నాళం వెంకట బ్రహ్మానందరావు
6. శ్రీ కనిగొళ్ళ ప్రకాశరావు
7. శ్రీ మోతే కృష్ణారావు జమీందారు (సెక్రటరీ అండ్ ట్రెజరరు)

గార్లు అయియున్నారు. అందువల్ల కంపెనీ తరఫున ఏవిధమైన వ్యాపారమైననూ వీరే చేయుటకున్నూ, కంపెనీ తాలూకు లావాదేవీలన్నియూ వీరే అమలు జరుపుటకున్నూ అర్హులైయున్నారు.

శ్రీ మైలవరపు రామకృష్ణారావు వగైరాలు కంపెనీయొక్క వ్యాపారము గాని లావాదేవీలు గాని జరుపుటకు ఎంతమాత్రము అర్హులు కారు, కాబట్టి శ్రీ మైలవరపు రామకృష్ణారావుగారు చేసిన ప్రకటనమును బట్టి కంపెనీ షేరుహోల్డర్లు గాని, తదితరులు గాని మోసపోవద్దని ఇందుమూలముగా తెలియజేయడమైనది.

ఇట్లు,
మోతే కృష్ణారావు,
సెక్రటరీ అండ్ ట్రెజరరు.
శ్రీ కృష్ణా జూట్ మిల్సు, లిమిటెడ్.,
యేలూరు.

యేలూరు,
16-5-1945.



Edited, Printed & Published by S.SambhuPrasad at the Andhra Patrika Press,
7 Thambu Chetty St., Madras